శ్రీశారదాయైనమః.

# శ్రీసోమేశ్వర శతకము.

ఇది

గనముక్కుల నాగులయ్యచే రచియింపఁబడి

మహారాజశ్రీ సోమపాళ్యం

కమగొండ కోటిరెడ్డిగారిచేతను,

మదనపల్లె బోర్డు హైస్కూలు తెలుగు

పండితులగు బ్రహ్మశ్రీ

వెంకటరామ శాస్త్రుల వారిచేతను

పరిష్కరింపబడి

మదనపల్లె

బ్రిటానియా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె

**1929.**

Price 0—1—6]  [ వెల 0—1—6.

# అంకితము.

శా॥ శ్రీగౌరీముఖ పంకజామృతరుచి
న్సేవించి సంతృప్తుఁడై।
నాగాలంకృతుని న్భజించి యవల
న్నాతంత్రికిఁ జేర్చిముదిన్।
న్నీగ్రంథంబునొనర్తు నంకితముగా
నీవే దయాసాగరా।
వేగంబే శుభముల్నవాంఛితముగా
వేవేలు సోమేశ్వరా॥

ఇట్లు బుధజనవిధేయుఁడు,
గ్రంథకర్త.

# శ్రీ సోమేశ్వర శతకము.



సీ॥ శ్రీగిరిజావర ♦ శ్రితజనమందార
సోమజటాధర ♦ శూలధార।
కాయజ సంహార ♦ కారుణ్యసాగర
వాతాశిధార మి ♦ న్నాకధార।
హస్తిచర్మాంబర ♦ యాగమగోచర
పాపసంహారక ♦ పాలహార।
బలగర్వరిపుహార ♦ ప్రణుతి శుభాకర
ఫాలలోచనధార ♦ భయవిదార॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ నీనామ మంత్రంబు ♦ నిరతంబు పఠియించు
పుణ్యుని రోగముల్ ♦ బొందగలవె।
నీపాదపద్మముల్ ♦ నిత్యంబు సేవించు
ఘనుని పాపంబులు ♦ గాంచగలవె।
నీచరిత్రాలించు ♦ నిర్మల హృదయుని
దారిద్ర్య దుఃఖముల్ ♦ దాయగలవె।
నీప్రాపుగాంచిన ♦ నిశ్చలాత్ముండు శ్రీ
కైవల్యపదమును ♦ గాంచుటరుదె॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్మసాలె।
కులజులిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుఁడగు గనముక్తుల ♦ శిద్ధయూర్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 4

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ శంకర నీపాద • పంకజంబుల సేవ
చేయకుండిన యట్టి • చేతు లేల।
పార్వతీవర నీదు • పావన నామముల్
నుడువకుండిన యట్టి • నోర దేల।
సర్వేశ నీమ్రోల • సాష్టాంగ దండంబు
లను చేయనట్టి యా • తనువ దేల।
చంద్రశేఖర నీదు • చరితామృతంబును
పూని క్రోలగ లేని • వీను లేల॥

గీ॥ కన్నెమడుగు పురీవాస • కర్నసాతి।
కులజు లిలువేలుపని పేరు • గొన్న దేవ।
శీలుడగు గనముక్కల • శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ • చిద్విలాస॥ 5

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ భానుబింబై శుభ ◆ ప్రదమైన రుద్రాక్ష
పూసలహారముల్ ◆ వేసినావు।
హరిపాద జనితయా ◆ నాకాశ గంగను
శిరమున జడలలో ◆ జేర్చినావు।
మించిన కారుణ్య ◆ ముంచి భూతంబుల
వంచన లేక పా ◆ లించినావు।
కిట్టని వారల ◆ పొట్టల భారియలు
బెట్టి త్రిశూలంబు ◆ బట్టినావు॥

గీ॥ కన్నమడుగు పురీవాస ◆ కర్ణసాల।
కాలజు లలువేలుపని పేరు ◆ గొన్న దేవ।
శీలుడగు గనమ్ముక్కల ◆ శిద్ధయార్య।
[illegible]త్రిసుమవాస సోమేశ ◆ చిద్విలాస॥

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ నీదయగల్గిన ♦ నిరుపేదయును పురం
దరుడుగా జెన్నారు ♦ ధర్మశీల।
నీదయగల్గిన ♦ నీటి బొట్టైనను
వారాశియౌను భ ♦ వానిలోల।
నీదయగల్గిన ♦ నీచతృణంబైన
పర్వతమౌను కృ ♦ పాలవాల।
నీదయగల్గిన ♦ నీచుండు సహితము
పరమపావనుడౌను ♦ భక్తపాల॥

గీ॥ కన్నెరుడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శిలుడగు గనముక్[illegible] ♦ శిద్ధ[illegible]।
చిత్తసుమువాప సోమేశ ♦ చిద్విలా[illegible]

8

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ నీదయ లేకున్న ♦ నిర్జరేంద్రుండైన
దారిద్ర్యమొందును ♦ దారిహృదయా!
నీ జేసి కష్టాపు ♦ నిగుడన పదునాల్గు
జగములు బెగడొందు ♦ నగనివాస!
నీమానతిని లేక ♦ నిజముగా పవనుడు
వీవగా వెరచును ♦ మా వినోద!
నీవు కినుక వహింప ♦ నిఖిలలోకంబులు
భయమంది వణకవే ♦ భద్రరూప॥

గీ॥ కన్నమసుగు పురివాస ♦ కర్ణసాక్షి!
ఖలజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ!
శీలుడగు గనమక్కల ♦ శిద్దయార్య!
చిత్రసుమహాస సోమేశ ♦ చిద్విలాస॥ 8

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ హరుడందునా దిగం ♦ బరుడందునా కృపా
కరుడందునా నిన్ను ♦ గరళకంఠ।
భవుడందునా లేక ♦ శివుడందునా వుమా
ధవుడందునా నిన్ను ♦ పరివిమలాత్మ।
అజుడందునా వృష ♦ ధ్వజుడందునా నేక
భుజుడందునా సోమ ♦ భూషదేవా
భీముడందునా బలో ♦ ద్దాముడందున దివ్య
నాముడందున నిన్ను ♦ నగనివేశ॥

గీ॥ కన్నముడుకు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 9

# శ్రీ సోమేశ్వర శతకము.

మానసీయగుణాన ♦ మాన మార్కండేయ
మానిషోడశవర్గ ♦ మానితుండు।
కడదనమందునీ ♦ గుడి జేరి లింగముఁ
బడివేసి కరముల ♦ నడిగబట్టి।
యముడరుదెంచి పా ♦ శములను మెడవైచి
లాగ లింగంబున ♦ వేగబట్టి।
కాలునిజంపి మా ♦ ర్కండేయ మునిచిరం
జీవిగా జేసిన ♦ శేషభూష॥

గీ॥ కన్నమడుగు పురివాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 12

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ చెలఁగి నీపదసేవ ♦ జేయకుండినయది
కరమగు నాకొయ్యొ ♦ గఱిటెగాక।
ఆర్తిఁ ఱుక నిన్ను ♦ గీర్తింపకుండిన
నోరగునా నీటి ♦ కోరగాక।
అమలమౌ నీకథ ♦ లాలింపకుండిన
చెవులగు నాపెద్ద ♦ గవులుగాక।
యిలనీకు సాష్టాంగ ♦ మిడనిది దేహమా
పొలముల నిడుదృష్టి ♦ బొమ్మగాక॥

గీ॥ కన్నమనుగు పురీవాస ♦ కర్ననాతె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 13

## శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ కరులున్న నేల నో ♦ కిరులున్న నేల నీ
స్మరణంబు లేకున్న ♦ సరసపురుష।
ధనమున్న నేల సం ♦ దనమున్న నేల నీ
పూజ లేకుండిన ♦ పుణ్యచరిత।
ఆలున్న నేల మై ♦ డాలున్న నేల నీ
పాలన లేకున్న ♦ ఫాలనయన।
సుతులున్న నేల ♦ స్నేహితులున్న నేల
కథలను వినకున్న ♦ కరళకంఠ॥

గీ॥ కన్నెచుడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధమూర్త్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 14

## శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ సకల తీర్థంబులు ♦ సరియగునా నీదు
చరణ ప్రక్షాళిత ♦ జలముతోడ।
సకల పుష్పంబులు ♦ సరియగునా నీప
దార్చిత మాలూర ♦ దళముతోడ।
సకల గంధంబులు ♦ సరియగునా నిన్ను
భూజ జేసినయట్టి ♦ భూతితోడ।
సకల మంత్రంబులు ♦ సరియగునా నీదు
పరమపావన నామ ♦ పఠనతోడ॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 15

శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ మోక్షప్రదాయక ♦ మునిజనపోషక
చండికా చిత్తాబ్జ ♦ చంచరీక।
బాలేందుశేఖర ♦ పరమదయాకర
తాపసంహార జి ♦ తారివీర।
కరిచర్మచేల భా ♦ సుర భక్తపరిపాల
పాపనిర్మూల ♦ కృపాలవాల।
భసితాంగశోభిత ♦ భక్తసంపూజిత
కిన్నరేశ్వరహిత ♦ కీర్తిసహిత॥

గీ॥ కన్నమదుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజులిలు వేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ సిద్ధయార్య।
చిత్తమునవాస సోమేశ ♦ చిద్విలాస॥ 16

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ అఖిల పాలిటి భయం ♦ కరములై మునిహితం
కరములై తనరు నీ ♦ కంకణాలరయ|
పాపుల కతిఘోర ♦ తాపన్నమై పుణ్యుల
ప్రాపులై పరగు నీ ♦ చూపులనఘ|
భోగాత్ములకు మనో ♦ వేదనంబై సాధు
మోదమ్మై తనరు నీ ♦ పాదరజము
అనయులకనలమై ♦ సదయుల కమృతమై
వెదజల్లుచుండు నీ ♦ వచనరుచులు॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణనాల|
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ|
శీలుడగు గనముక్కల ♦ శిష్టయార్య|
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 17

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ నిండారు భక్తిచే ♦ నిన్ను పూజించెడి
కేలునకేల వ ♦ జ్రాల నగలు।
నీపదార్చన భూతి ♦ నేపారదాల్చెడి
నుదుటికేటికి మృగ ♦ మదతిలకము।
నీకథారత్నముల్ ♦ సోకుచునుండెడి
వీనులకేటికి ♦ వింతనగలు।
నిరతంబు నీనామ ♦ స్మరణంబుజేసెడి
మనసునకేటిగి ♦ మారుచింత॥

గీ॥ కన్నెచుడుగు పుకీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గపముక్కల ♦ శిద్ధమూర్త్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 18

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ దివ్యదేశంబుల ♦ దిరిగిన ఫలమేమి
నిన్ను నమ్మకయున్న ♦ నీలకంఠ।
మురియుచు తీర్థాల ♦ మునిగిన ఫలమేమి
మనసు నీయడ లేక ♦ మదనహరణ।
కనులుమూసియు వేళ్లు ♦ గదలింప ఫలమేమి
చిత్తమందున నీదు ♦ చింత లేక।
ఒక్కపొద్దులచేత ♦ జిక్కిన ఫలమేమి
భక్తి నీపై లేక ♦ భవ్యచరిత॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 19

## శ్రీసోమేశ్వర శతకము.

సన్యాసులని కావి ♦ వస్త్ర పుట్టముగట్ట
ఫలమేమి నీయందు ♦ భక్తి లేక।
గురులని రుద్రాక్ష ♦ సరులను మెడవేయ
ఫలమేమి నీనామ ♦ భజన లేక।
అయ్యగార్లని బూది ♦ నంగమెల్లను బూయ
ఫలమేమి మనసు ని ♦ శ్చలము లేక।
సాములమనివ్యాఘ్ర ♦ చర్మముల్ ధరియింప
ఫలమేమి మదిని నీ ♦ తలపు లేక॥

గీ॥ కన్నెమునుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 20

## శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ ఆంగ్లేయులెల్లగా ♦ డ్డనుచు నిన్బొగడిరి
మ్లేచ్ఛులల్లాయని ♦ మెచ్చుకొనిరి।
క్రైస్తులు నిన్నేసు ♦ క్రీస్తని దలచిరి
శైవులు నిన్ను శ్రీ ♦ శంభుడనిరి।
వైష్ణవుల్ బొగడిరి ♦ విష్ణువటంచునిర్
బౌద్ధులుగొలిచిరి ♦ బుద్ధుడనుచు।
తక్కినవారెల్ల ♦ పెక్కుపేరులబిల్చి
మక్కువతో నీకు ♦ మ్రొక్కిడిరి॥

గీ॥ కన్నమదుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 21

శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ నదులెల్ల నందండు ♦ చెదరుచు బారిన
కడలిలోపల బోయి ♦ కలియునట్లు।
షడ్రసోపేత భ ♦ క్ష్యమ్ముల రకములు
వేలులైనను నోర ♦ జేరునట్లు।
తరుశాఖలెంత వం ♦ కరలైన జివురులు
గగనభాగంబును ♦ గాంచునట్లు।
యెవరెన్ని పేరుల ♦ స్తవమొనర్చినగాని
నిన్ను బొందునుగాదె ♦ నిగమవేద్య॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కన్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తనుమువాస సోమేశ ♦ చిద్విలాస॥ 22

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ పొట్టకై డంభముల్ ♦ గొట్టుచు పెద్దగా
పట్టెనామంబుల ♦ బెట్టువారు।
పరులను వంచింప ♦ శిరమెల్లగొరిగించి
ధరణియందెల్లెడ ♦ దిరుగువారు।
ధనమునార్జింపగా ♦ గనినవేషమునకు
పూనికతో బూది ♦ బూయువారు।
వీరెల్లనీకృపా ♦ ధారుడౌ నాతని
కాలిధూళినినైన ♦ బోలగలరె॥

గీ॥ కన్నముడుగు పురీవాస ♦ కర్మసాలె।
కులజులిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధయార్య।
చిత్తమువాస సోమేశ ♦ చిద్విలాస॥ 23

# శ్రీ సోమేశ్వర శతకము.

వాయసంబున కెట్టి ♦ వన్నె వేసినగాని
రమణీయమైన ♦ మరాళమగునె|
గాడిదకైన జీను ♦ గట్టినయంతనే
చుఱుకుగల్గిన యట్టి తురగమగునె|
గాజుఱాతికి నెట్టి ♦ కాంతిగల్గినగాని
రవణిగుల్కెడి ముద్దు ♦ రత్నమగునె|
వేషంబులను వేయు ♦ మోసగాండ్రిల్ల నీ
దాసులౌదురె వారు ♦ క్షేమభూమ||

గీ|| కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాలె|
తులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ|
శీలుడగు గనముక్త్యాల ♦ శిద్దయాగ్య|
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస|| 24

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ కుక్కుటబంగారు ♦ కుబుసంబు దొడగిన
పాదరక్షలపసి ♦ బట్టుకున్నె।
ముష్టిపండ్లను బాల ♦ ముంచినయంతనె
తియ్యని రుచులను ♦ నియ్యగలవె।
పుత్తడికత్తిచే ♦ బొడచినంతనే యీత
చెట్టున నమృతంబు ♦ బుట్టగలదె।
మంచునకెంతనీ ♦ మహిమ బోధించిన
నీపాదముల భక్తి ♦ నిలుపగలదె॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజులిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 25

28

శ్రీ సోమేశ్వర శతకము.

తలచితి మదిలోన ♦ దైవమీవేయని
వంచన లేక వీ ♦ క్షింపవేల|
పిలిచితినోరార ♦ కలుషహారాయని
యోయనవేలరా ♦ యొక్కసారి|
వలచితి నీదేహ ♦ వర్ణంబు గాంచగా
చయ్యన దర్శనం ♦ బియ్యరాద|
కొలచితి నిన్నునా ♦ కులదైవ మనుచును
యిదియైన నీమది ♦ కెరుక లేద||

గీ|| కన్నమడుగు పురీవాస ♦ కర్నసాలె|
కులజులిలువేలుపని పేరు ♦ గొన్నదేవ|
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య|
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస|| 28

శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ కాచితి దయనీకు ♦ గలుగదా యనుచును
వేమారుదలచుచు ♦ విశ్వనాథ।
లేచితి నిద్దుర ♦ లేశంబు నీభక్తి
హృదయమందు జనింప ♦ మదనదమన।
సాచితి కరములు ♦ సౌఖ్యాకరంబైన
మోక్షయాచకుడనై ♦ మునిజననుత।
దాచితి యిగనైన ♦ దయగల్గదాయని
కరినుండవని జాట ♦ కనుగిరీశ॥

గీ॥ కన్నమదుగు పురీవాస ♦ కర్నసాల
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 29

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ రాదేమిరా దయ ♦ రజతాచలనివాస
విన్నపమాలించి ♦ నన్ను బ్రోవ।
బాధయేమిర నీకు ♦ సాధుజనావన
నా మొరనాలించి ♦ నన్ను బ్రోవ।
కాదేమిరా దిక్కు ♦ లేదని నిను వేడు
శరణాగతుల బ్రోచు ♦ బిరుదు నీది।
నీదేమిరా నష్ట ♦ మాది దేవేశ్వర
కరుణ తోడుత నన్ను ♦ గాచినంత॥

గీ॥ కన్నెమడుగు పురివాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 30

శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ జేసితి నెన్నియో ♦ చెడుకార్యములు భువి
దుర్మతినై నేను ♦ నిర్మలాత్మ।
వేసితి నెన్నియో ♦ వేషంబులను నేను
సాటిగల్గనీ పొట్ట ♦ కూటికొఱకు।
కూసితి దబ్బర ♦ కూతలనెన్నియో
సంసార కార్యముల్ ♦ జరుపదలచి।
బాసితి నీనామ ♦ భజనంబు జేయుజ
యేరీతి ననుగావ ♦ నెంచినావొ॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్నసాలె
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కాల ♦ శిద్ధయార్య।
చిత్తముమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 31

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ పాలింపవేలరా ♦ బాలిశుడగు నన్ను
బాలేందు వహ్నాళి నీ ♦ పాలబడితి|
ఆలింప వేలరా ♦ తాలిమిచే నినా
వేడెడి నామొఱ ♦ వేగనభవ
తూలింపవేలరా ♦ ఫాలాక్ష నాపాప
ములనెల్ల నిపుడు ♦ నిర్మలముగాను|
చాలింపవేలరా ♦ చలముచే నీపాద
దాసుని యెడల ని ♦ ర్దయను జూప॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్నసాల|
తులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ|
శీలుడగు గనముక్కల ♦ శిద్దయాగ్య|
చిత్తనుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 32

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ కావలెనని మది ♦ గలిగిన నీకున
గాచుటయున నది ♦ కష్టమగు నె।
రావలె వేగమే ♦ రక్షింపవలెనన్న
దూరమగునా నన్ను ♦ జేరనీకు।
యీవలెనని నీకు ♦ నిచ్చగల్గినయెట్టి
సౌఖ్యమియ్యగ నీకు ♦ శక్తిలేదె।
నీవలెదయగల్గు ♦ నేతలేడని నమ్మి
నీదరిజేరితి ♦ నీలకంఠ॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కన్నసాలె।
కులజులిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 33

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ కడ జేయఁబోకు నీ ♦ కరుణావలోకనం
బులకును నన్నయో ♦ బుధజననుత।
యెడ జేయఁబోకు నా ♦ యెడఁదలో నీపద
భక్తిమానికమును ♦ భవవినాశ।
పడ జేయఁబోకు నన్ ♦ పాపాగ్నికీలల
భస్మీకృతంబుగా ♦ భావజహర।
నడచేయఁబోకు వి ♦ నాశంపు త్రోవల
నంధునిజేసి న ♦ న్నమలచరిత॥

గీ॥ కన్నెచుడుగు పురీవాస ♦ కర్ణసాల।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తమువాస సోమేశ ♦ చిద్విలాస॥ 34

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ అన్నంబు లేకున్న ♦ కొన్ని వారంబులు
ప్రాణముంపగవచ్చు ♦ ఫణివిభూష।
జలము లేకుండిన ♦ కొలది దినంబులు
జీవముంపగవచ్చు ♦ చిద్విలాస।
గాలి లేకను కొన్ని ♦ గడియలు దేహంబు
బాయకుండగ వచ్చు ♦ భవవినాశ।
నీదయ లేకున్న ♦ నిమిషంబు తనువును
గాపాడ నెవ్వరో ♦ గరళకంఠ॥

గీ॥ కన్నమదుగు పురీవాస ♦ కర్మసాక్షి।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయాంగ్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 35

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ జయగిరిజా మనో ♦ జలజభృంగోత్తంస
జయనిర్మలాగము ♦ సరసి హంస।
జయమత్తమాతంగ ♦ చర్మాంబరగిరీశ
జయభక్త భవనాశ ♦ జయపరేశ।
జయమౌని మానస ♦ జలసంభవాలయ
జయమహిమామేయ ♦ జయసుగేయ।
జయమనోహర రూప ♦ చంద్రఖండకలాప
జయత్రిలోక సుదీప ♦ శైలచాప॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్నసాల।
కులజులిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 36

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ దండంబు నుత్తమే ♦ తండచర్మాంబరా
మండన శైలకో ♦ దండహస్త।
వందనంబు సునీల ♦ కంధర రజితాద్రి
మందిర వృషభరా ♦ జేంద్రగమన।
జోహారు శత్రుస ♦ మూహమూల వినాశ।
ఆహవభీమ ♦ దయాభిరామ।
ప్రణుతి భవత్పాద ♦ పంకజంబులకును
సుర దైత్యగణసేవ్య ♦ శుద్ధమునులకు॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసార।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 37

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ నిదుర లేచియు భవా ♦ నీసమేతా యని
తలచెడివాఁ డెగా ♦ ధన్యుఁడవని।
మధ్యాహ్నమందున ♦ మదనాంతకా యని
తలచెడివాఁ డెగా ♦ ధన్యుఁడవని।
సంధ్యవేళను నిన్ను ♦ సాంబా యటంచును
తలచెడివాఁ డెగా ♦ ధన్యుఁడవని।
శయనించు వేళని ♦ శంకరా యనుచును
తలచెడివాఁ డెగా ♦ ధన్యుఁడవని॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుఁడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తమునవాస సోమేశ ♦ చిద్విలాస॥ 38

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ మానిజనావళీ ♦ మానస నిలయముల్
పరికింప నీపాద ♦ పంకజములు।
భక్తుల మదిలోని ♦ ముక్తిని దానముల్
పరికింప నీపాద ♦ పంకజములు।
దరిలేనివారలు ♦ దలదాచు కొనురక్ష
ణాలయంబులు నీప ♦ దాంబుజము ।
సత్యవాదులనోర ♦ జరియించు ధర్మదే
వతలగు నీపద ♦ వారిజములు॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 39

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ ఏలరా యీచల • మేలరా నిర్దయ
యేలరా నేనునీ • పాలబడితి।
భారమా నీకు నే • దూరమా బ్రోవగా
క్రూరమా నాయందు • దారహృదయ।
లేరురా నీసరి • వారు రాజాంకమే
తీరున నన దరి • దేల్పగలవా।
కోపమా నాపూర్వ • పాపమా తెలుప
కాపాడవేలరా • పాపహారా॥

గీ॥ కన్నమడుగు పురీవాస • కర్ణసాల।
కొలుజు లిలు వేలుపని పేరు • గొన్నదేవ।
శిలుసగు గనముక్కల • శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ • చిద్విలాస॥ 40

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ వేదాంతవేద్య నీ ♦ వేగతి యని మది
నమ్మియున్నానయ్య ♦ నాగభూష!
యేరీతిగా నగా ♦ నెంచియున్నాడవో
నీకె వేద్యంబది ♦ నేనెరుంగ!
పతితపావనుడను ♦ నతులమౌ బిరుదంబు
గాంచినవాడని ♦ నాశపడితి!
పాలముంచిన నీట ♦ బడదోసినను గాని
భారంబు నీదెయో ♦ పరమపురుష॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్మనాశ!
కులజులిలువేలుపని పేరు ♦ గొన్నదేవ!
శీలుడగు గనముక్కల ♦ శిద్ధయార్య!
చిత్తసుఖవాస సోమేశ ♦ చిద్విలాస॥ 41

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ నీనామభజనంబు ♦ నిత్యకల్యాణంబు
సంసార వహ్నికి ♦ జలధరంబు।
నీనామభజనంబు ♦ నిత్యమానందంబు
నఘనగతతికి వ ♦ జ్రాయుధంబు।
నీనామభజనంబు ♦ నిత్యసౌభాగ్యంబు
దారిద్ర్యజలధికి ♦ తరణిగాదె।
నీనామభజనంబు ♦ నిత్య ప్రమోదంబు
కైవల్యప్రాప్తికి ♦ కారణంబు॥

గీ॥ కన్నచుడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 42

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ పదునాల్గు భువనముల్ ♦ పాలన జేయు నీ
కారయ ననుగాచు ♦ టనగ నెంత।
విసమును బరులకై ♦ మెసవిన నీకు నా
పాపంబులను రూపు ♦ మాపుటెంత।
వేడువారల కోర్కెలీ ♦ డేర్చునీకు నా
యభిమతంబును దీర్చు ♦ టనగ నెంత।
పతితులనైన జే ♦ పట్టగల్గెడి నీకు
ననుదయతో జూచు ♦ టనగ నెంత॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 43

శ్రీ సోమేశ్వర శతకము.

యేమని బొగడిన ♦ యింపగునో నీకు
మెరుగనివాడనో ♦ పరమపురుష।
యేగతి పూజింప ♦ యిష్టమో నీమది
కెరుగనివాడనో ♦ దురిత హరణ।
యేరీతినడువచే ♦ కూరునో నీదయ
తెలియనివాడనో ♦ దేవదేవ।
యేవ్రతంబులు సల్పు ♦ టెక్కువో నీకునే
గమనింప జాలనో ♦ విమలచరిత॥

గీ॥ కన్నమనుగు పుకేవాస ♦ కన్నసాలె।
కాలజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ
శీలుడగు ఘనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 44

శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ జగతి చీకటి బాప • జంద్రసూర్యుల సృష్టి
గలుగ జేసినయట్టి • ఘనుడవీవె।
ప్రాణికోటులను గా • పాడగా జలదముల్
గావించిన మహాను • భావుడీవె।
ఫలవృక్షములను క • ల్పనచేసి జీవుల
యాకలి బాపిన • యనఘుడీవు।
పరతిగా నిదురింప • పరగ ప్రాణులకెల్ల
నిశలు జేసిన కృపా • నిధివినీవె॥

గీ॥ కన్నె మడుగు పురివాస • కర్మనాశ।
కులజు లిలు వేలుపని పేరు • గొన్న దేవ।
శీలుడగు గనముక్కల • శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ • చిద్విలాస॥ 45

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ నీపదంబుల భక్తి • కాపదంబుల విరక్తి
మొనగూర్పవే నాకు • మునిసుపోష!
సుజనులఁగూడియు • కుజనులవీడఁడి
మదినిప్రసాదింపు • మదనహరణ!
సత్ప్రథాపేక్షయు • ముక్త్యర్థాపేక్షయు
గలిగింపవే నాకు • కలుషహరణ!
పరమునందున నాశ • దురితమందుసిరాశ
బుట్టింపవే నాకు • బుధజననుత॥

గీ॥ కన్నమడుగు పురీవాస • కర్ణసాలె!
కులజు లిలువేలుపని పేరు • గొన్న దేవ!
శీలుడగు గనముక్కల • శిద్దయార్య!
చిత్తసుమవాస సోమేశ • చిద్విలాస॥ 46

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ తులలేని సంసార ♦ జలనిధి దరిజేర
నావయౌగాదె నీ ♦ నామభజన।
ఘోరమౌ పాపాంధ ♦ కారంబు బాపన
భోమణిగాదె నీ ♦ నామభజన।
అజ్ఞానవల్లరి ♦ నంతంబొనర్పగా
నారాజిగాదె నీ ♦ నామభజన।
సారమౌ కైవల్య ♦ దారిని జూపగా
నయనమౌగాదె నీ ♦ నామభజన।

గీ॥ కన్నెకుడుగు పురీవాస ♦ కర్నసాల।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 47

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ గగనభాగంబున ♦ గన్పడుతారల
గణుతింపగావచ్చు ♦ గష్టమనక।
ధరణీతలముచుట్టు ♦ పరిమితినైనను
లెక్కింపగావచ్చు ♦ నెక్కువనక।
తలపోసి జలముల ♦ కొలతలింతేయని
జెప్పగావచ్చును ♦ తప్పలేక।
నీసృష్టిరాహస్య ♦ సిద్ధులనెన్నగా
శతధృతికైనను ♦ శక్యమౌనె॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కిర్ణసాలె।
తులజ లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయాగ్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 48

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ పక్షిసంతతులు నం ◆ బరమున జరియింప
ఱెక్కలుంచిన దేవ ◆ ఱేడవీవు।
జంతుకోటుల నివా ◆ సమునకై కానన
సీమలజేసిన ◆ స్వామివీవు।
మత్స్య విశేషముల్ ◆ మరలాడగా నదీ
సదనముల గల్పించి ◆ నాథవీవు।
శిశుపాలనంబును ◆ చేయుటకై యురో
జముల బుట్టించిన ◆ జాణవీవు॥

గీ॥ కన్నెమూసుగు పురివాస ◆ కర్ణసాలె।
కులజు లిలువేలుపని వేడు ◆ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ◆ శిద్ధయార్య।
చిత్తమునవాస సోమేశ ◆ చిద్విలాస॥

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ పాపపూరితరూప ♦ భాగ్యాండవని నన్ను
కడదోయబోకుమో ♦ గరళకంఠ।
నీపూజజేయని ♦ నీచుండవని నన్ను
విడనాడబోకుమో ♦ విమలచరిత।
ధర్మమించుకయైన ♦ దలపనివాడని
కోపగింపకుమన్న ♦ పాపహరణ।
మదిని నీభజనయే ♦ మరచితినని క్రూర
చూపులజూడకో ♦ సుగుణభరిత।

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాల।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ సిద్ధయాగ్య।
చిత్తమున వాస సోమేశ ♦ చిద్విలాస॥ 52

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ అంధకాసుర గర్వ ♦ హర దేవవర దివ్య
సుందర కైలాస ♦ మందిరవర।
భూతేశ భవ్యాస ♦ భోగీశ మండిత
భోగేశయాశవి ♦ రాగపోష।
కోమలమృదు గాత్ర ♦ భూధరజాతకళత్ర
సూర్యాగ్ని శశినేత్ర ♦ శుభచరిత్ర।
భసితలిప్తాంగ సం ♦ భరితకరుణాపాంగ
విషమాస్త్రమదభంగ ♦ వృషతురంగ॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 53

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ కలనైన సత్యంబు ♦ దలపనివాడని
దయవీడబోకు సు ♦ ధాంశుమౌళి!
నీతిలేక జరించు ♦ నీచుండనని కృప
యెడ జేయబోకు భో ♦ గేంద్రభూష!
న్యాయదూరుడనని ♦ బాయజేయకునీకృ
పావలోకనముల ♦ భావజహర!
ఆరయమిగుల దు ♦ రాశాపరుండని
పరునిగా జూడకో ♦ పాపహరణ॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణసాలె!
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ!
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య!
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 54

## శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ భక్తరక్షకుడని ♦ భ్రమజెందితినిగాని
కఠినుండవని యెఱుం ♦ గను గిరీశ।
సదయాత్ముడనుచును ♦ మదిని నమ్మితిగాని
నిర్దయాత్ముడవని ♦ నేనెఱుంగ।
ఆర్తజనత్రాణు ♦ డనియెంచితినిగాని
డాంభికుడని నిన్ను ♦ దలప లేదు।
నమ్మువారల నిధా ♦ నమ్మనినమ్మితి
కపటనాటకుడని ♦ నపుడెఱుంగ॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గవముక్కాల ♦ శిద్ధమార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 55

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ కల్లనైన సత్యంబు ♦ దలపనివాఁడని
దయవీడఁబోకు సు ♦ ధాంశుమౌళి।
నీతిలేక జరించు ♦ నీచుండనని కృప
యెడ జేయఁబోకు భో ♦ గీంద్రభూష।
న్యాయదూరుఁడనని ♦ ఛాయ జేరకు నీకృ
పావలోకనముల ♦ భావజహర।
ఆరయ మిగుల దు ♦ రాశాపరుండని
పరునిగాఁ జూడకో ♦ పాపహరణ॥

గీ॥ కన్నమనుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుఁడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 54

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ భక్తగణ్యుడని ♦ భ్రమజెందితినిగాని
కరినుండవని యెరుం ♦ గను గిరీశ।
సదయాత్ముడనుచును ♦ మదినమ్మితిగాని
నిర్దయాత్ముడవని ♦ నేనెరుంగ।
ఆర్తజనత్రాణు ♦ డనిమెంచితినిగాని
డాంభికుడని నిన్ను ♦ దలప లేదు।
నమ్మునారల నిధా ♦ నమ్మనినమ్మితి
కపటనాటకుడని ♦ నపుడెరుంగ॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాల।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధయార్య।
చిత్తనుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 55

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ శరణుసదానంద ♦ సకలాఘతబృంద
దూరీకృతైక ప ♦ దారవింద|
వాసుదేవామర ♦ వందిత విశ్వేశ
శ్యామలామలచిత్త ♦ ధామసదయ;
సకలలోకాధార ♦ మకరాంక మదహార
పరికలిత బలశూర ♦ భయవిదూర|
నిశితశూలాయుధ ♦ నీరజాసననుత
భసితసంమోహిత ♦ భవ్యచరిత॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాల|
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ|
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య|
చిత్తమునవాస సోమేశ ♦ చిద్విలాస॥

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ యెప్పుడైన నీమది ♦ కించుకేనియు దయ
జనియించునని నమ్మి ♦ తినిగిరీశ।
యెప్పుడైన ననుబ్రోవ ♦ నేతెంతువనుచును
నాశవహించితి ♦ నమరవినుత।
యెప్పుడైన దర్శన ♦ మిచ్చినామనవి నా
లించెదవని మది ♦ నెంచితిభవ।
యెప్పుడైన నీనామ ♦ జపముచే ధన్యత
సిద్ధించుననుచు నెం ♦ చితిపరేశ॥

గీ॥ కన్నమనుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 57

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ యేరీతి నన్ను సం ♦ సార సాగరమును
దాట జేయగ నీవు ♦ దలచినావో।
యెట్టువలె నా పాప ♦ పటలంబు నెల్లని
ర్మూలంబు గావింప ♦ బూనినావో।
యేలీల నీపాద ♦ నాళీకములను నా
చిత్తమందుంప యో ♦ చించినావో।
యేగతి కైవల్య ♦ భోగంబొసంగిన
న్నేపారగా జేయ ♦ నెంచినావో॥

గీ॥ కన్నకొడుకు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గపముక్కల ♦ శిద్ధమూర్త్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 58

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ ఆకలిగొను వేళ ♦ నాహారమిడుచును
నెల్లజీవులఁబోచు ♦ తల్లివీవు|
వేదశాస్త్రలకోర్కె ♦ లీడేర్చి నిరతంబు
దయమీఱ నేలెడి ♦ తండ్రివీవు|
మంచిమార్గమునఁ జ ♦ రించగా సుజ్ఞాన
కరదీప మొసగెడి ♦ గురుఁడవీవు|
నిన్ను ధ్యానించెడి ♦ నిశ్చలాత్ములకును
మోక్షమిచ్చెడి కృపా ♦ మూర్తివీవు॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాలె|
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ|
శీలుఁడగు గనముక్కల ♦ శిద్దయార్య|
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 59

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ భక్తులపాలిట ♦ పారిజాతంబని
నమ్మితి నిన్ను నా ♦ నెమ్మనమున।
దీనుల నేలెడి ♦ దేవరత్నంబని
కామించితిని నిన్ను ♦ నామనమున।
ఆర్తులపాలి కృ ♦ పాబ్ధివంచని నిన్ను
దలచితి మదిని ని ♦ ర్మలముగాను।
శరణాగతుల బ్రోచు ♦ సురధేనువనుచును
నీపదంబుల మది ♦ నిలిపినాను॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కిర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయాగ్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 60

# శ్రీ సోమేశ్వర శతకము

సీ॥ చేరదీసియు నన్ను ♦ జేపట్టకుండిన
శంకరుడనుమాట ♦ బొంకుగాదె।
ఆరసినా మొర ♦ నాలింపకుండిన
కరుణాకరుండంట ♦ కల్లగాదె।
దయతోడ నాపాప ♦ తతిగూల్పకుండిన
దైవంబ వనుటబ ♦ ద్ధంబుగాదె
నరగమోక్షంబు వ్రి ♦ సాదింపకుండిన
జగతిపాలకుడంట ♦ జలిగాదె॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ,
శీలుడగు గనముక్కల ♦ శిద్ధయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 61

సీ॥ బ్రతికి వచ్చెనింక • బ్రతుకుదునో లేదో
నోరాగి చెప్పడే • నుతియొనర్తు|
యిపుడున్న బుద్ధినా • కికమీదనుండునో
నుండదో యెప్పుడే • దండమిత్తు|
కరములందు శక్తి • తరుగునో పెరుగునో
పూజింతు నిప్పుడే • పొలుపుమీర|
జిహ్వాపటిమ యుండింక • చెడునో యుండునో ఓంన
మశ్శివాయ యటంచు • నుచ్చరింతు॥

గీ॥ కన్నెచుడుగు పురీవాస • కర్ణసాలె|
కులజు లిలు వేలుపని పేరు • గొన్న దేవ|
శీలుడగు గనముక్కల • శిద్దయార్య|
చిత్తమునవాస సోమేశ • చిద్విలాస॥ 62

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ లంచంబులను దీయు ♦ లంజపుత్రులకొల్వు
కన్ననునీకొల్వు ♦ మిన్నగాదె।
కూటసాక్ష్యమ్ముల ♦ గూయుకూళలకొల్వు
కన్నను నీకొల్వు ♦ మిన్నగాదె।
ముండలబాధించు ♦ రండాసుతులకొల్వు
కన్నను నీకొల్వు ♦ మిన్నగాదె।
సాధుల వేదించు ♦ జారసూనులకొల్వు
కన్నను నీకొల్వు ♦ మిన్నగా

గీ॥ కన్నెమడుగు పురివాస ♦ కర్నసాలె।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 63

## శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ ధనమదంబున దూగు ♦ తామసేంద్రులకొల్వు
కన్నను నీకొల్వు ♦ మిన్నగాదె।
పరులసిరులకసూయ ♦ పడెడినీచులకొల్వు
కన్నను నీకొల్వు ♦ మిన్నగాదె।
నమ్మించి చెరచెడి ♦ నాలిముచ్చులకొల్వు
కన్నను నీకొల్వు ♦ మిన్నగాదె।
పాపకార్యముల దోఁ ♦ ప్పెడి దుష్టులకొల్వు
కన్నను నీకొల్వు ♦ మిన్నగాదె॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణసాల।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 64

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ శంభోమహాదేవ ♦ శంకర సర్వేశ
కరుణాకరా నీల ♦ కంఠగిరీశ।
ఆగమారామ వి ♦ హారవైభవలోల
జాలమేలర కరు ♦ ణాలవాల।
పరమేశ్వరా హర ♦ పార్వతీ ప్రియవర
ఆశ్రితోద్ధార సు ♦ మాస్త్రహర।
ప్రమదాదిపా భక్త ♦ పాలన శశిధర
దివిజచూడామణి ♦ దివ్యకేశ॥

గీ॥ కన్నమడుగు పురివాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 65

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ ఆశనువిడలేక ♦ నల్లాడుచున్నది
మానసంబది యేమొ ♦ మదనహరణ,
సుతులని సతులని ♦ చుట్టాలుహితులని
ధనధాన్యవస్తు వా ♦ హనములనుచు।
కనులజూచినవెల్ల ♦ కావలెననుచును
తృప్తియించుకలేక ♦ తొందరిడుచు।
వేదింపుచుండెనే ♦ నేదిక్కుగానరో
సోమేశనాథ నీ ♦ పదములెగతి॥

గీ॥ కన్నుచుడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు విలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధసూర్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 66

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ ప్రణవస్వరూపనీ ♦ పాదపంకజములు
దివిజులౌ దలదాల్చు ♦ దివ్యమణులు।
పన్నగాభరణనీ ♦ పాదపద్మమ్ములు
ఆశ్రితకోటికి ♦ నమృతనిధులు।
శశిధరనీదివ్య ♦ చరణరాజీవముల్
దాసులమదిలోని ♦ ద్రవ్యగిరులు।
పశుపతి నీదివ్య ♦ పాదారవిందముల్
మానులుబూజించు ♦ మానికములు॥

గీ॥ కన్నెమనుగు పురీవాస ♦ కన్నసాలె।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 67

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ దండుగ సొమ్ము ♦ సంతర్పణల్ జేసిన
ఫలమేమి ప్రజలమె ♦ ప్పులకెగాక।
సన్యాసులనుదోచి ♦ నత్రముల్ గట్టింప
ఫలమేమి ప్రజలమె ♦ ప్పులకెగాక।
పేదలబీడించి ♦ పెరుమాళ్లగుడిగట్ట
ఫలమేమి ప్రజలమె ♦ ప్పులకెగాక।
తెరువులందునదోచి ♦ పటిణయంబులొనర్ప
ఫలమేమి ప్రజలమె ♦ ప్పులకెగాక॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలువని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 68

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ కష్టార్జితంబొక్క ♦ పట్టెడన్నము వేయు
సంతర్పణలు వేయు ♦ జరిపినట్లు।
ధర్మార్జితంబుచే ♦ తగుపాటి గుడిసెను
గట్ట వేచతిములు ♦ గట్టినట్లు।
సత్యవర్తనచేర ♦ సంపాదితార్థము
కాసివ్వయాగంబు ♦ జేసినట్లు।
కరుణతో ప్రజకుప ♦ కారంబు జేసిన
పరిణయంబులు వేయు ♦ జరిపినట్లు॥

గీ॥ కన్నమనుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ ౭౮

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ ఆలంబునందు నా ♦ భీలమై గ్రాలెడు
శూలమెవ్వని కర ♦ వాలమునయా।
కొప్పుగా వాలముల్ ♦ ద్రిప్పుచునుండెడి
భుజగంబు లెవ్వాని ♦ పూలసరులు।
ముల్లోకములనైన ♦ ముప్పతిప్పల బెట్టు
జ్వాల లెవ్వని కంట ♦ జ్వలితమగును।
అట్టి నీపాదంబు ♦ లాశ్రయించెదను నా
కరమును వీడకో ♦ పరమపురుష॥

గీ॥ కన్నమడుగు పుర్కివాస ♦ కర్నసాల।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తమున వాస సోమేశ ♦ చిద్విలాస॥ 70

# శ్రీసోమేశ్వర శతకము.

సీ. కోటిరూప్యములిచ్చి ♦ కొనదలంచినగాని
యబ్బునే నీకరు ♦ ణామృతంబు।
వెలయురత్నఘనినిధుల్ ♦ వెచ్చించినంతనె
కలుగునే నీకటా ♦ క్షంబు వెన్న।
పసిడిచేలములు డం ♦ బంబుగా నొసగిన
ప్రాప్తించునే నీకృ ♦ పారసంబు।
పశువుల నొకలక్ష ♦ ప్రఖ్యాతికొసగిన
పొందునే నీప్రేమ ♦ పుష్పలతను॥

గీ॥ కన్నెమనుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజులిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుఖవాస సోమేశ ♦ చిద్విలాస॥ 7

శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ కాంతనమ్మియు కాట ♦ కాపరియగు హరి
శ్చంద్రునకీవె రా ♦ జేంద్రపదవి।
పూనికతోడనీ ♦ ధ్యానమొనర్చిన
పార్థునకీయవే ♦ పాశుపతము।
యుచ్ఛిష్టమాంసంబు ♦ నొసగుచుండినబోయ
వానికియ్యవె ముక్తి ♦ వల్లభగవి
నేనొనర్చినఘోర ♦ నేరంబదేమొనా
చెయివీడజూడనో ♦ చిత్తజహర॥

గీ॥ కన్నెచుడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తమువాన సోమేశ ♦ చిద్విలాస॥ 72

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ ధనముగల్గినవాఁడు ♦ తనగ్రామమందున
పొగడికగనుచుండు ♦ పొలుపుమీర।
రాజ్యంబుగలవాఁడు ♦ రాజిల్లుచుండును
తనయేలుబడిలోన ♦ దరచుగాను।
విద్వాంసుడగువాఁడు ♦ విజ్ఞానులెచ్చోట
నుందురోనచట మె ♦ ప్పొందుచుండు।
నీదయగలవాఁడు ♦ నిఖిలలోకములందు
పూజింపబడుగాదె ♦ భుజగభూష॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణసాలె
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కాల ♦ శిద్దయార్య
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 73

శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ నగరులందున నీవె ◆ నగములందున నీవె
యారామసీమల ◆ యందు నీవె।
నదులయందున నీవె ◆ నదములందున నీవె
నారయ జీవుల ◆ యందు నీవె।
కనకమందున నీవె ◆ విషమునందున నీవె
యాదిత్యశశిధరు ◆ లందు నీవె।
కాంతియందున నీవె ◆ కాంతారముల నీవె
నిఖిల జగంబుల ◆ నీవు గావె॥

గీ॥ కన్నమడుగు పురీవాస ◆ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ◆ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ◆ శిద్దయాగ్య।
చిత్తసుమవాస సోమేశ ◆ చిద్విలాస॥ 74

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ సురనరులందున • నరునందునను నొక్క
కరణిగా నీకృప • బరగుగాదె।
గోబ్రాహ్మణులనను శ్వా • తారమునందున నొక్క
వరుసన నీదయ • వరలుగాదె।
సామజేంద్రమునందు • చీమనందును నొక్క
మాదిరి నీప్రేమ • మరలుగాదె।
పరమాణువందైన • ప్రబలవస్తువునైన
సమముగా నీకృప • సాగుగాదె॥

గీ॥ కన్నెమడుగు పురీశాన • కర్ణసాల।
కులజు లిలువేలుపని పేరు • గొన్న దేవ।
శీలుడగు గనముక్కల • శిద్ధయార్య।
చిత్తమున వాస సోమేశ • చిద్విలాస॥ 75

శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ కాలయాపన జేయు ♦ కారణం బేమిరా
భోగివనీ భావంబు ♦ బూనదేమొ।
జాగేలసేయగా ♦ భోగభూషణనన్ను
కృపజూడనీ ♦ కనుల్ గోరవేమొ।
దారుణంబగు నిరా ♦ దరణ జేయగనేల
నామొర నీ చెవుల్ ♦ నమ్మవేమొ।
పంతంబిదేమి నీ ♦ పాదపంకజములు
తెంపుగానిట జను ♦ దేరవేమొ॥

గీ॥ కన్నె మడుగు పురీవాస ♦ కర్మసాలె।
కులజు లిలు వెలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తనుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 76

## శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ ప్రియసఖుల దయతోడ ♦ బాలింపుచుండినా
మాటలు నీచెవి ♦ నాటవేమొ।
యార్యతోడ ప్రియోక్తు ♦ లాడుచుండియు నన్ను
దయజూచుమాటయే ♦ తలపవేమొ।
ముద్దుసూనులు బల్కు ♦ నుద్దులనాలించి
పేడిరా నీకు గా ♦ ళ్లాడవేమొ।
దిక్పాలనోద్యోగ ♦ దిగ్వృక్షుచే జని
నన్నేలమరచియు ♦ న్నాడవేమొ॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజులిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 7

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ అరిదళంబులనెల్ల ♦ నురుమాడఁగా జని
ననుబ్రోవ నరదియు ♦ న్నాఁడవేమొ।
పరగ నవీనప్ర ♦ పంచంబు సృష్టింప
దలచుచు ననుగావ ♦ దలపవేమొ।
భక్తవర్గ్యుల నెల్ల ♦ బాలింపగా నేగి
నా చూటు మరచియు ♦ న్నాఁడవేమొ।
దీనులరక్షింప ♦ బూనికతో నేగి
నన్నుఁ గృపజూడకు ♦ న్నాఁడవేమొ॥

గీ॥ రత్నమదుగు పురీవాస ♦ కర్ణసాల।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥. 78

79

శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ కలువలరాయుని ♦ కాంతిచే నెవ్వాని
ఫాలభాగవిభూతి ♦ ప్రజ్వరిల్లు।
రుద్రాక్షమాలికా ♦ రుచులచే నెవ్వాని
వక్షమందెర్రనై ♦ వరలుచుండు।
యింద్రనీలపు కాంతు ♦ లీనుచు నెవ్వాని
గళమందు గరళంబు ♦ గానుపించు।
అట్టినీపాదంబు ♦ లాశ్రయించెదనన్ను
కరుణతో నేలుమో ♦ పరమపురుష॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కన్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ సిద్ధయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 79

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ పరగ నెవ్వానికి క ♦ పాలంబు భోజన
పాత్రింబులీల నొ ♦ ప్పారు చుండు।
మదకరిచర్మమే ♦ మన్నికాను ధరించు
దుప్పటిరీతిగా ♦ నొప్పు చుండు।
పునుక సరంబులే ♦ పురుషోత్తమునికంఠ
మందున విరిదండ ♦ లైనవట్టె।
అట్టి నీపాదంబు ♦ లాశ్రయించెదనన్ను
కరుణతో నేలుమో ♦ పరమపురుష॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణసాల।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధయార్య।
చిత్తమువాన సోమేశ ♦ చిద్విలాస॥ 80

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ దరిజేరు చింతాగ్ని ♦ తాపంబు జల్లార్చు
సదమగు గాదె నీ ♦ నామభజన।
కష్టాంధ కారంబు ♦ కడదోయ గను సూర్య
దామమౌగాదె నీ ♦ నామభజన।
భక్తులకోర్కెల నా ♦ ఫల్యమొనర్చు చిం
తామణిగాదె నీ ♦ నామభజన।
అరయమునిమనో ♦ కరముల్ దిరుగునా
రామమౌగాదె నీ ♦ నామభజన॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్మనాశ।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 81

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ నీనామమంత్రంబు ♦ నీచతాపత్రయ
భంజనంబు మునీంద్ర ♦ రంజనంబు।
నీనామ మంత్రంబు ♦ నిజభక్తులకు కర్ణ
భూషణంబు సురేంద్ర ♦ తోషణంబు।
నీనామమంత్రంబు ♦ నిగమభూషణ కళా
పూరణంబు మహౌఘ ♦ మారణంబు।
నీనామమంత్రంబు ♦ నిఖిలపిశాచాళి
బాధకంబగు సాధు ♦ సాధకంబు॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్నసాల
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 82

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ శరణాగత త్రాణ ♦ బిరుదాంక సర్వేశ
పార్వతీ హృదయేశ ♦ పరమపురుష।
దీనజనోద్ధార ♦ మానినీలోకాధార
బుధజనమందార ♦ భుజగహార।
భక్తవత్సల కృపా ♦ భరణ గయూరంధ్ర
త్రిభువనోద్ధారక ♦ దివ్యభావ।
సుజనజనావన ♦ సురలోకపావన
శాత్రవహరణాప ♦ విత్రచరణ॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తనుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 83

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ తలపోసినవరత్న ♦ ములలోన జూడ చిం
తామణీ శ్రేష్ఠమై ♦ దనరు గాదె।
చర్చించి సకలభూ ♦ జములందు జూడక
ల్పక భూజమెక్కుడై ♦ పరగు గాదె।
విస్తరంబుగా జెంతు ♦ వితతియందున జూడ
కామధేనువు శ్రేష్ఠ ♦ కంబు గాదె।
పరగ మంత్రములెల్ల ♦ సరయగా నీనామ
మంత్రంబు శ్రేష్ఠత ♦ మంబు గాదె॥

గీ॥ కన్నతుడుగు పురీవాస ♦ కర్ణనాలె।
కులజులిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్ధమూర్త్య।
చిత్తమునవాస సోమేశ ♦ చిదివిలాస॥ 84

85

## శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ యొక్కనైన నామొర • లించుకేనియువిని
బ్రోవరాదయాతోడ • భావజహర।
యొక్కసారైన నాక్రోశ ను • లించుకేనియుగని
కరుణతో నేలరా • దురితహరణ।
యొక్కనైన నామది • కించుక సంతోష
మొనర్చింపగా రాద • యురగభూష।
యొక్కనైన నాజన్మ • మిరవొందగా పావ
నముజేయబూనరా • నగనివేశ॥

గీ॥ కన్నమడుగు పురీవాస • కర్నసాల।
కులజు లిలువేలుపని పేరు • గొన్నదేవ।
శీలుడగు గనముక్కల • శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ • చిద్విలాస॥ 85

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ చొప్పుగా నీదయ ♦ తప్పకుండెడివేళ
కొంచక జలధిలోఁ ♦ ఘూఁచవచ్చు।
జాయక నీదయ ♦ పెరుగుచుండెడివేళ
జడరక పర్వతా ♦ మెత్తవచ్చు।
నిండార నీకృప ♦ నెగడుచుండెడివేళ
ఘోరానలంబున ♦ దూరవచ్చు।
పొలుపార నీకృప ♦ పొదలుచుండెడివేళ
మిరిమివోలె విసంబు ♦ మ్రింగవచ్చు॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణసాల।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయాగ్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 86

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ ధనమదంబున దూల ♦ గను జేసియంతలో
లేమినొసంగెడి ♦ సామివీవు।
సార్వభౌమ పదంబు ♦ సమకూరగా జేసి
యంతలో దిరిపెము ♦ త్రింతువీవు।
సకలభోగంబు లా ♦ సంగియు వెంటనే
చింతాబ్ధిలోపల ♦ ముంతువీవు।
వొప్పారగా కీర్తి ♦ నొసంగియు వెంటనే
మయశంబునబడ ♦ దోయింతువీవు॥

గీ॥ కన్నమనగు పురివాస ♦ కర్నసాలె।
కులజులిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిదిలాస॥ 87

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ కరిచర్మచేల నీ ♦ కరుణ లేకున్ననా
దురితజాలంబెల్ల ♦ దొలగు టెట్లు।
దర్పకారాతి నీ ♦ దయ లేక యున్ననా
కష్టంబులెల్లను ♦ గడచు టెట్లు।
త్రిపుర సంహార నీ ♦ కృప లేక యున్ననా
భవబంధములనెల్ల ♦ బాయు టెట్లు।
సోమశేఖర నీదు ♦ ప్రేమ లేకున్ననా
జన్మసాహిత్యంబు ♦ జరుగు టెట్లు॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్మనాశ।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 88

శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ పరగవిరాగిగా ♦ పలుకజ్ఞానుడుగాడు
తాపత్రయంబుల ♦ దగిలియున్న।
జడలుదాల్చిన తాప ♦ సశ్రేష్ఠుడాగాడు
మదిలోన నీభక్తి ♦ గుదురకున్న।
నీకీర్తనలు బాడ ♦ నెఱిభక్తుడాగాడు
మనసుననీచింత ♦ మరచియున్న।
మాటాడకున్నంత ♦ మౌనివర్యుడుగాడు
జ్ఞానచక్షువుననిన్ ♦ గానకున్న॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజులిలువేలుపని పేరు ♦ గొన్నదేవ।
శీలుడగు ఘనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 89

సీ॥ నాతప్పులెల్ల మ • న్నన జేసిబ్రోవగా
నితరులునాకిక • నెవ్వరయ్య।
పూనినా పాపముల్ • బోజేయుసినువినా
నాకుదిక్కెవ్వరు • న్నారుదేవ।
నాకష్టములనెల్ల • నాశంబొనర్పగా
పరులెవ్వరున్నారు • ఫణివిభూష,
ముక్తినొసంగినన్ • మునమొందజేయగా
వేఱెకెవ్వరు • న్నారుదేవ॥

గీ॥ కన్నెమడుగు పురీవాస • కర్ణసాలె।
కులజు లిలువేలుపని పేరు • గొన్న దేవ।
శీలుడగు గనముక్కల • శిద్ధయార్య।
చిత్తసుమవాస సోమేశ • చిద్విలాస॥

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ కరుణ లేదేలరా ♦ కాలకంధర నీకు
మన్నించివేగమే ♦ నన్ను బ్రోవ।
దయ లేద దేలరా ♦ దాక్షాయణీవర
జాలిచేనామొర ♦ నాలకింప।
ప్రేమ లేదేలరా ♦ కామసంహార నా
తాపత్రయంబుల ♦ బాపుటకును।
కృప లేదదేలరా ♦ కోరినవారు నీ
రూపంబునొకపరి ♦ జూపుటకును॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్నసాల।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 91

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ పార్వతియైనఁ ♦ బాలింపుమనుచును
దెలుపదా నీకొక ♦ తేపయైన|
గణపతియైనఁ ♦ గాపాడుమనుచును
బలుకఁడా నీతోడ ♦ పట్టువలగ|
శరజన్ముఁడైనఁ ♦ గరుణింపుమనుచును
జెప్పఁడానీతోడ ♦ నొప్పుగాను|
పూనిఃతోబుద్ధి ♦ పుట్టదా నీకైన
జాలిచే నన్నిక ♦ నేలుటకును॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్ణసాల|
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ|
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య|
చిత్తమువాస సోమేశ ♦ చిద్విలాస॥ 92

## శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ పన్నగాభరణ నీ ♦ పాదపద్మమ్ములే
నాకిక గతియని ♦ నమ్మినాఁడ
కరుణాకరా నీవె ♦ గావకుండిన వేరె
దిక్కెవ్వరున్నారు ♦ త్రిభువనముల
పరుల వేఁడు మటంచు ♦ పలుకఁ జూచెద వేని
నొల్లను నిన్నుఁ గా ♦ కొరుల వేఁడ
జగము లెల్లను నేల ♦ జాలగల్గిన నీవు
నను బ్రోవ లేవన ♦ నమ్మఁదగునె॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్మసాక్షి
క్షాళజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 93

## శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ తగునే మిరానీకు ♦ తాపసమందార
కఠినంబుబూని నా ♦ కరము వీడ|
సరియగునా నీకు ♦ సాధుజనావన
దాసుండనగు నన్ను ♦ గాసిబెట్ట|
మేరయా నీకిది ♦ మేనకాత్మజవర
గతిలేనినన్ను ని ♦ ర్దయను జూడ|
మరియాదయా నీకు ♦ మనసిజహరణ నా
మనవినిసుంతేని ♦ వినకయుండ॥

గీ॥ కన్నమదుగు పురివాస ♦ కర్నసాలె|
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ|
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య|
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 94

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ అడుగను సార్వభౌ ♦ మాదిపత్యంబును
జెలువారనీపద ♦ శేవజాలు।
కోరను ద్రవ్యమే ♦ పాఁగానిమ్మని
యింపుగా నిన్నుపూ ♦ జింపజాలు।
వేఁడను రత్నాల ♦ మేడలిమ్మనుచును
మరువక నినుగొల్వ ♦ మనసుజాలు।
యాచింప ఘనభూష ♦ ణావళి నిమ్మని
యిరవొందగా మోక్ష ♦ మియ్యజాలు॥

గీ॥ కన్నమనుగు పురీవాస ♦ కర్నసాల।
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాన సోమేశ ♦ చిద్విలాస॥ ౯౦

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ పావనంబైన నీ ♦ పదసేవదొరకిన
ధన్యునకేల సా ♦ ధనంబులరయ
విమలమౌ నీనామ ♦ వినుతిలభించిన
మాన్యునకేల సా ♦ మ్రాజ్యమేల
తలపోయ నీకృపా ♦ ధారంబుగలిగిన
పూజ్యునకేల నే ♦ భోగమేల
కన్నులనీమూర్తి ♦ గన్నపవిత్రుని
కేటికినింక దే ♦ వేంద్రపదవి॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణసాలె
కులజు లిలు వేలుపని పేరు ♦ గొన్న దేవ
శీలుడగు గనముక్కల ♦ శిద్ధమార్య
చిత్తసుమవాఘ సోమేశ ♦ చిద్విలాస॥ 96

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ శంకరా గిరిజాప ♦ శంకరాశత్రునా
శంకరా దయఁజూడు ♦ సంకటహార|
పావనాశీసజ ♦ నాపనభక్తసు
జీవనా వేగనక ♦ బ్రోవరాగ|
భూషణా భోగేంద్ర ♦ భూషణా యోగీంద్ర
పోషణా కృపజూడు ♦ పావగనన్ను|
యీశ్వరా సకలలో ♦ కేశ్వరా నిగమాన
చేశ్వరా కరుణతో ♦ నేలరార॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణసాలె|
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్నదేవ|
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య|
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 97

శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ పంచాక్షరీ మంత్రి ◆ పంచాధిదైవంబ
పంచపూజల తృప్తి ◆ బడయుదేవ।
పంచపంచాత్మక ◆ పరమాత్మరూపివై
సకలజంతువులకు ◆ సాక్షివగుచు।
జీవరూపంబున ◆ చెలగినటించుచు
జీవసాక్షివగుచు ◆ జీవకోటి।
పుట్టించిపెంచుచు ◆ పొడవడగించుచు
మూడుమూర్తుల ◆ రూపములమైన॥

గీ॥ కన్నమడుగు పురీవాస ◆ కర్నసాల।
కులజు లిలువేలుపని పేరు ◆ గొన్నదేవ।
శీలుడగు గనముక్కల ◆ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ◆ చిద్విలాస॥ 98

# శ్రీసోమేశ్వర శతకము.

సీ॥ పరిణవస్వరూపనిఁ ♦ భావించి మదిలోన
హృదయాకమలమందు ♦ పదిలపరచి।
నీరూపుచూపున ♦ నెఱిచిత్తమునహార్తి
పంచప్రాజలతృప్తి ♦ బరచుటకును।
భక్తిచందనమును ♦ రక్తియాక్షతలును
శాంతిసుమంబుల ♦ క్షాంతిపూజ।
గావింతుసర్వేశ ♦ శేవింతునర్పింతు
స్వస్తితే శుభమస్తు ♦ సుస్థిరోస్తు॥

గీ॥ కన్నెమడుగు పురీవాస ♦ కర్నసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ।
శీలుడగు గనముక్కల ♦ శిద్దయార్య।
చిత్తసుమవాస సోమేశ ♦ చిద్విలాస॥ 99

# శ్రీ సోమేశ్వర శతకము.

సీ॥ మంగళంబురగేంద్ర ♦ ఖండనభవదీయ
పావనచరణ రా ♦ జీవములకు।
సన్మంగళము నీ ♦ నిర్మలకరుణైక
వీక్షితనేత్రార ♦ విందములకు।
శుభమంగళము సర్వ ♦ శుభములొసంగెడి
నీనామమంత్రని ♦ ధానమునకు।
జయమంగళంబెల్ల ♦ జగములు నిత్యంబు
భ్రాజించు నీదివ్య ♦ తేజమునకు॥

గీ॥ కన్నమడుగు పురీవాస ♦ కర్ణసాలె।
కులజు లిలువేలుపని పేరు ♦ గొన్న దేవ
శీలుడగు గనముక్కాల ♦ శిద్దయార్య।
చిత్తమునవాస సోమేశ ♦ చిద్విలాస॥

శ్రీసోమేశ్వరశతకము సంపూర్ణము.